శ్రీరస్తు.

---

కడపజిల్లాపులివెంద్రతాలూకా.

తొండూరికాపురస్థుడైన.

సోమరాజమహాకవిచే.

విరచితంబైన.

---

మక్కాంగంబరిక్రమము.

నాటకము

ఇది.

పండితపరీక్ష్యకృతంబుగావింగ.

శ్రీవేంకటసుబ్బాశాస్త్రులవారి.

సరస్వతీవిలాసముద్రాక్షరశాలయందు.

---

కోట వీరరాఘవయ్య.

కడప - సౌటిపల్లి వీరయ్య-శెట్టి.

యీయిరువురిచే.

అచ్చువేయించి ప్రచురింపబడియె.

౧౮౭౧ సం॥ ఆగష్టునెల.

ప్రకటన,

ఈరుక్మాంగదచరిత్రమునాటకముగ్రంథకర్తయైనపాపరాజ మహాకవివారసున్నువార్లగుంటాగ్రంథస్వాతంత్ర్యమున్నుమే ముగిరిమెంటువ్రాయించితీసుకొనిఅచ్చువేయించిచట్టప్రకా రము - కాపీరైట్టుచేయించియున్నాము గనుకదీన్ని యితరు లెవరున్నుఅచ్చువేయకూడదు.

కోట- వీరరాఘవయ్య-

కడప- చాటపల్లె. వీరయ్య-శెట్టి-

## రుక్మాంగదచరిత్రనాటకమునందలివిషయసూచిక.

## రుక్మాంగదచరిత్రనాటకమునందలి విషయసూచిక.











శ్రీరస్తు.




## శ్రీకృష్ణదేవుని ప్రార్థన.

రుక్మాంగదచరిత్రము - యక్షగానము

ఉ॥ శ్రీరమణీశుఁడాశ్రితవిశేషముదప్రదుఁడాద్యుఁడాగమో । ద్ధారుఁడు
లవర్ణుఁడు సుధామయభాషణుఁ డబ్జగర్భపా । కారిమునీంద్రవందితుఁడు కం
ుసమానగళోజ్జ్వలుండుతాం । ద్వారిపురీశకృష్ణుఁడు పటుత్వకవిత్వమహ
త్వమీవుతన్॥ * * * * * *

దరువు - నాటరాగము ఝంపెతాళము.

జయపద్మదళనేత్ర - జయపావనచరిత్ర - జయమోహనసుగాత్ర - జ
యభక్తమిత్ర - జయ - జయ - ... ... ... *

జయమహాసురజైత్ర - జయరమాసుకళత్ర - జయదేవపుత్ర - జయ
దివ్యసూత్ర॥ జయ - జయ ... ... ... ... *

జయదీనమందార - జయశత్రుసంహార - జయమహాహవశూర - జ
యగోత్రధీర॥ జయ - జయ - ... ... ... *

జయత్రిజగదాధార - జయమందరోద్ధార - జయసముద్రగభీర - జయ
కలుషదూర॥ జయ - జయ - ... ... ... *

జయరమాహృదయేశ - జయసర్వలోకేశ - జయభూతభవపాశ - జయసురాధీశ॥ జయ-జయ- ... ... ... ... ... *

జయసత్కృపావేశ - జయయఘౌఘవినాశ - జయతులొండూరీశ - జయసుప్రకాశ॥ జయ-జయ- ... ... ... *

శ్లోకము॥ శ్రీకృష్ణంశరదభ్రశుభ్రసుయశంనీరేరుహాంఘ్రిద్వయంభ్రాజత్కుండలకాంతికండయుగళంకోట్యర్కసంకాశితం। బ్రహ్మేంద్రాదినుతప్రకృష్టచరితంగోపాంగనేశంహరిం వందే తొండురివాసమబ్జనయనంపర్యేశ్వరంసర్వదా॥ * * * * *

దరువు-తోడిరాగము-ఆదితాళము.

వినుతింతుచెద బాల-సర్వజన-వినుతగోపబాల- * * *

వనజసమానన - పైశివిపాటన - ఘనాఘనసమవిగ్రహసుందరవద॥ విని॥

వరనిజతేనుం దరకళయుతమః- దరధరవిధిశం- కరపవిసన్నుత॥ వి॥౨

కదనవిజితదశ- వదనమణిమయ-సదనపూర్ణవిధు వదనరమాధిప॥ విను౩

ఘోరదురితకుజ-భూరికుఠారసు-వీరధీరతొం- డూరివిహార॥ విను॥ ౪

గణపతిప్రార్థన.

గీ॥ కాంతుహరిహారసన్నుతకరితశాంతు। కాంతునుపొంతుసమధికకార్యవంతు। దాంతువిఘ్నేశునాథునదరవసంతు। నేకభక్తినివినుతింతునేకదంతు॥ * * * * * * *

దరువు తోడిరాగము- ఆదితాళము.

విఘ్నరాజపాహి-సతతము-విఘ్నకతందేహి-విఘ్నరాజకేలు- పఘ్నసకలశ-త్రుఘ్నకావ్యదో-షఘ్న ఉమాసుత॥ ... ... విఘ్న॥౧

బాలచంద్రఫాల-గజాస్యవి- శాలకనకచేల- వ్యాళసుభూషణ - నీలదురకవి-ఫాలరజితగిరి-లోలకలుషహార॥ ... ... విఘ్న॥౨

పారదసమదేహ-శిలాద్రివి-హారలలితబాహ - మేరుధీరవర సూరిజనావన-శారదశిఖివిహారగబాధిప॥ ... ... విఘ్న॥౩

పండితజనపోష- మణిమయ - మండలమృమభూష-తొండూరీశ్వర స్మరితహరణియా-ఖండలనుత వే-దండముఖాంచిత॥ ... విఘ్న॥౪

తద్ధితరికిటితరిత ఝుణుకి ణాం-తరితధిగరికిట తకిటఝుణాంతరి॥ శ్రీజ సుగజముఖ-భూజనసుతగుణ - రాజచంద్రసమ-తేజసకలది-గ్రాజాదిగత కట-భూజవిద్యలను-భోజితవనినిను- పొసగగదలచెద - తాధై ధై ధత్తధాం తారి తకిట తొండూరిగణాధిప-ధీరానువిచారా - గంభీరావరమీరావద- హారుత్తై ననుత-వారములను చే-కోర్రా మొక్కేరా- ధరితా తతకిట- తద్ధి- మికిటతధిమిధిమితఝుణంతకదధిగిణతోం॥ ... విఘ్న॥

సరస్వతీప్రార్థన.

చ॥ తొలితలవాకిటన్మెలగులోయిజనేత్రిగు రొమ్ముతాకపీం। దుర్లకులసత్కవిత్వములుతోడుత్సనిచ్చితినాదువాక్యస। ల్లలితమరందధార ప్రబలంబుగనిక్కవగల్ల జేసిన త్పలమియ వేదయావతివిధాత్సతి సుకృతీసరస్వతి॥ ... ... ... ... ... *

దరువు - నీలాంబరిరాగము - ఆదితాళము.

వాణిబింభరసమ- వేణిస్సైకతశ్రోణి-వీణాసంయుతమృదు - పాణిధృజ-రాణీపల్లవ-పాణిరావాణి॥ ... ... ... *

జంభశుంభరి - కుంభకోకఘన -డింభకసమకుచ - కుంభయుగాంచిత- కోకిలవాణి॥ ... ... ... యోవాణి॥౧॥

మణిగణఖచితకిం-కిణియుత మేఖల-ఝుణఝుణసంకుల - గణితసుమధ్యమ- పల్లవపాణి॥ ... ... ... యోవా॥౨

నిటలతటాంచిత- కుటిలకుంతలావృత - నటిత మోహనాకార- వటుముఖశోభిత-పల్లవపాణి-యోవాణి॥ ... ... యోవా॥౩॥

తారహారక- శృంగారపటీరతు - షారకీర్తిలోం - డూరిపురీశ్వరి-పల్లవపాణిరోవాణి॥ ... ... ... ... ౪॥

జతి॥ తధరిఝుణాంతరి-తకిణుఝుకిటతకు - తక్కధిమిమితద్ధిమి - తకిణుఝుణాంథిమి- నాతిమైనమృదు-వాణిజలదసమ-వేణిస్సైకత- శ్రోణిప

ల్లవ-పాణీ-చతుర్ముఖు-రాణీ-ధణతద్ధణ॥ ... ... వ

వందే భారతి-సుందరాంగియర-విందనయనమమ్ము- దయజూడవె-దిందడిందధరి కుంధత-కిటధరి - శారదాంబలోం-దూరీశ్వరి- నిను- కోరికలతమన-సూరనుతించెద-తారి త్తరిధి త్తధిమితకిటతకుదధిగిణతోంతధిగిణతోం దింగిణతోం పల్లవ పాణి॥ ... ... యోవాణీ॥

జతి॥ తధరి-ఝుణాంతరి-తకిణఝుంకిటతకు- తక్క-ధిమిమిత్ధిమి-తకిణఝుణాంధిమి-నాణెమయినన్నుదు-పాణిఒలదనమ-వేశ సైకత - శ్రోణిపల్లవ-పాణిచతుర్ముఖు రాణిధణత్ధణవందే భారతి -సుందరాంగియర-విందనయనమ-ముందయజూడవె దిందదిందవరికుంద తకిటధరి - శారదాంబతోం దూరీశ్వరినిను - కోరికలరమన-సూరనుతించెద - తారి త్తరిధి త్తధిమితకిట తకుదధిగిణథోం-తకుదధిగిణథోం - తకుదధిగిణథ్ధోం - కుధధిగిణథ్ధోం॥ పల్లవ పాణి॥ ... ... ... ... ... వోవాణీ॥

క॥ అనియిష్టదేవతా స్తుతు । లొనరించియుహర్షణ మొదవనున్నత కవులకా । వినుతింపుచురుక్మాంగద । ఘనచరితముసభల వెలయగారచి యితుకా॥ * * * * * * * * *

క॥ మునుశుకయోగివరీక్షి । జ్జనపాలునకమ్మృత మొదరుగసంతోషిని వినుపించినరీతి జెప్పెనీకథ । ఘనుడగు శ్రీపవరాజకవివరుడెలమిన్॥ *

కథాప్రారంభము.

క॥ పురములమేలగునటకా । పురమునకుసాటియనగ బుణ్యామునకునా। పురమగుచునలవిదేశా । పురమున్ జెలువొందె సకలభూపవినుత మై॥

ఉ॥ పచ్చలరచ్చలంగమగుబంగరురంగుమెరుంగుగోడలన్ । మచ్చులగచ్చులంపసరుమూడలమేడల జాడవాడలు। స్వచ్ఛముమెచ్చుచి త్తగులసందమునందము జెందుసరములు। స్వచ్ఛరుచెచ్చుగాబొగడ నప్పురిమెచ్చగనిర్చువేడుకన్॥ ... ... ... ... ... ... *

సంధివచనము.

ఇవ్విధంబున నొప్పు నప్పట్టణంబును సకలజనసమ్మతంబుగా బరిపాలనం
బు సేయుచుండి రుక్మాంగద రాజేంద్రుండొక్కనాడు సకలభూషణభూషి
తుండై సకలమునిగణవిప్రజనపరివృతుండై సభాస్థానికి వచ్చు సమయంబున॥

చోపుదారి వేషకథ.

శ్రీపవమాని దలచుచు। సేవకులం బిలువుమనుచు జెప్పిన యారాజా
వని పాలునిభక్తుడు। కేవలమతి యప్పుడు చిత్రగ్రీవుడు వచ్చెన్॥ *

దరువు తోడి రాగము- ఆదితాళము.

భజరే శ్రీకృష్ణం-హేమాంబర-భజరే శ్రీకృష్ణం-పభజ-రే శ్రీకృష్ణం-సుజనవి
ధేష్ణం త్రిజగోత్కృష్ణం। దీప్తరోచిష్ణం॥ ... ... భజరే॥ ౧
జలధివిహారం సత్యోద్గారం-కలుషవిదారం కౌస్తుభహారం॥ భజరే ౨
నీలఘనశ్యామం-నిజజనాభూషం-[illegible]నేత్రనుత-పాదమధీశం॥ ॥భ॥ ౩
దీనసంరక్షం-దానవశిక్షం మానితలోకపూరి- మందిరాధ్యక్షం॥ భజరే॥ ౪

చిత్రగ్రీవుని-మాటలు.

ఆహా యెవరోయి - ప్రధానోత్తములారా - ఆహా యెవరోయి దండనాయకులారా - ఆహా యెవరోయి పౌరాణికులారా - ఆహా యెవరోయి పండితులారా-ఆహా యెవరోయి- సేనానాయకులారా - ఆహా యెవరోయి పరిచారకులారా - ఆహా- మహా ప్రధాన-మండలీక-సామంత-ద్వారపాలక-అపసరక-గడియారక-ఆలవట్టక-రజక- వస్త్రచ్ఛేదక - అడియాలక ఫణిహారక-పడవగక-పటాంచలస్వర్ణకారక ధక్కిక- లోహకారక - త్రపుకారక-మలాలక-దారుకారక-శిలాభేదక -పద్మకారక- మార్దంగిక తాళధర-నాట్యకారక - శ్రుతికారక - పరిహాసక - మృగయార్థ-పశ్వగజకర్ణ గోర్ణక అశ్వికుక-గజశిక్షక-ఇంద్రజాల- మహేంద్రజాల-గారుడ అగ్ని స్తంభన- జలస్తంభన-ఖడ్గస్తంభన - వాయు స్తంభన - పరకాయప్రవేశ వీరు మొదలు గాగల చెప్పదిరెండు విద్యాయోగంబుల వారు కొలువున నాజరుగానుండవలెసినది- తరణివంశోద్భవుండైన, సకలరాజాధిరాజరాజ పరమేశ్వరాష్టది

గ్రాజమనో భయంకరుండగు రుక్మాంగదసార్వభౌముండు కొలువుకూటంబునకువచ్చుచున్నాడు-యెవ్వరెవ్వరివారి స్థలంబుల బహుహెచ్చరికలతోనుండవలసినది॥ ... ... ... ... ...

రుక్మాంగదమహారాజు.

సభకువచ్చుట.

దరువు మధ్యమావతి. ఆదితాళము.

శ్రీవరాచ్యుతకృష్ణాహరే- మాంపాహిశౌరే శ్రీవరాచ్యుతకృష్ణాహరే-ప॥ భావజజనకను-రావన మునిజన పావననుత సం-జీవనమాధవ॥ శ్రీ॥ ౧

పారసనేత్రభ కస్తూ-షా-కౌస్తుభభూష-వారిధిశయనమృదుభాష-శౌనకసనక-సనందనవందిత- మేరుధీరసం-సారదయాకర॥ శ్రీ॥ ౨

నందనందనదివ్యరూపా- భూపకలాప- సుందరనరసింహరూప - మందరధరముచు - కుందవరదసా - నందమదనోనత - సుందరవిగ్రహా॥ శ్రీ॥ ౩

నీరదవర్ణా- మేరుధీరా - వార్ధిగంభీరా - మారజనకసుకుమారా- కారణపురుషసు- రారిమదావహ -నారాయణలో౦ దూరిపురాధిప॥ శ్రీ॥ ౪

హరినారాయణచరధ్యానము-ఒరయగజేసిన-నరవరులకు-దుర్ధరమగుపాపము-హరియగు శ్రీహరికడతేర్చును-తాం థైయ్యాకిటకతాం థైయ్యాతక- తధిమితకిటతతక-తకఝణుకిటతక-తన్కుణు-తరి రేమను కాంత- తధిమితకిటతరి-వారిజాక్షలో౦-మూరిపురీవరదపాల- వేణుగోపాల - నుతశీలకరుణాలవాల- కిటకతాకుతకిట- తక- తధిమితకిటతకతధిమిధిమితఝణుతకదధిగిణతో౦॥ శ్రీవరాచ్యుతకృష్ణాహరే॥ ... ... ... ✱

గీ॥ ఇవ్విధంబుననరుదెంచిహితులుబుధులు - సచివభృత్యులుగొల్వగా సభనుజేరి- పావనమనస్కుడౌచిత్రగ్రీవుజూచి - పల్కెసంతోషముప్పొంగపార్థివుండు॥ ... ... ... ... ... ✱

రుక్మాంగదవాక్యము.

ఆహా॥ యోరిచిత్రగ్రీవా - యేమయ్యాప్వామీ-

క॥ఓరీచిత్రగ్రీవా - కారణగురుడైనసుప్రకాశువశిష్ఠు। ధీరతనటకు

స్వేగమె - రారమ్మని పిలిచిరమ్ము రాగముమీర॥ ... *

అహో యోగీ చిత్రగ్రీవా - మనకులగురుండైన వశిష్ఠమహాముని రుక్మాంగదరాజేంద్రుండు పిలుచుకొనిరమ్మన్నాడని విన్నవించి పిలుచుకొని రార

చిత్రగ్రీవుని వాక్యము.

మంచిదిబుద్ధిస్వామీ - తమయాజ్ఞప్రకారంబునం జనిమనగురువులను పిలుచుకవచ్చెదనుస్వామి మహారాజా॥ ... ... ... *

గీ॥ స్వామినాకీంద్రఖండప్రణామమిదిగో - చేసినాడదయనుమీకు శిష్యవర్యుడైన రుక్మాంగదుండు ను హర్షమొదవ। రమ్మటంచునినన్ను బంపెరమ్ము దేవ

వ॥ అహో స్వామీ మీశిష్యుడైన రుక్మాంగదరాజేంద్రుండు కొలువుకూటంబున సకలపరివారసమేతుండై కొలువుండి - దేవరవారిని పిలుచుకొనిరమ్మని యాజ్ఞయిచ్చినారు తమరువిజయంచేయవలెను స్వామీ॥ *

వశిష్ఠమహాముని వాక్యము॥ అహో యోచిత్రగ్రీవ॥

క॥ వచ్చెదరాజునుదర్శనః- మిచ్చెదగడుశీఘ్రముగ సుస్నిగ్ధులుదానుగా స్వచ్ఛందంబుగజనములు- ముచ్చటగానున్నవారె మురహారికరుణా॥

వ॥ అహో యోగీ చిత్రగ్రీవా - జాగ్రతగావచ్చెదను మీరాజునకు విన్నపము చేయుము యోగీ॥ మంచిదిబుద్ధిస్వామీ॥ ... ... *

వశిష్ఠమహాముని.

రాజుసభకువచ్చుట.

దరువు- మాంజి - ఆదితాళము.

హరిహరిపరమా- నందముకుంద। శరణాగతరక్షకగోవింద। హరి॥ ప.

నీరదకాయా- నిగమోపాయా- క్రూరదనుజహర- ఘోరవితేజా॥ హరి॥ ౧

నిరుపమశూరా- నిగమోద్ధారా - నరహరికరుణా - కరసురవందిత పండితవేషా- భక్తోల్లాసవే- దండపరదశ్రీ-తొండూరీశ॥ హరి॥ ౨

రుక్మాంగదవశిష్ఠవాక్యములు.

అహో శరణు శరణ మహాత్మా మద్వంశగురూ - దీర్ఘాయుష్మంతుడవై వర్ధిల్లుమో

యిరుక్మాంగదా ॥ మనవిచేసెదను వినుండయ్యా స్వామీ॥ యెటువలెనోయి రుక్మాంగదా॥ ... ... ... ... ... *

దరువు-సౌరాష్ట్రరాగము-చాపు-తాళము-

వ్రతము సేయవేడ్క-గలదుహితవుగా మానీంద్రవిష్ణుమతము గానుండెడు నాకు వ్రతము దెల్పవే - మానీంద్రా - వ్రతము దెల్పవే॥ ౧

వ ॥ ఆహా స్వామీ విష్ణువునకు ప్రీతికరమైనయొక్క వ్రతము చేయమనసుకలదు ఆ వ్రతమే మాకు దెల్పవలెను స్వామీ॥

దరువు-సౌరాష్ట్రరాగము॥చాపుతాళము-

వ్రతములకు మేటియైన - వ్రతము దెల్పెద నేకాదశి - వ్రతము విష్ణుమతముగలదు। వరింపవయ్యా-రుక్మాంగద వివరింపవశయ్యా-

వ॥ఆహా వోయి రుక్మాంగదా చెప్పెద వినుము ఈ వ్రతములలోన సుకృతమేకాదశి - వ్రతము యెక్కువైనది గనుక నట్టి వ్రతము సేయుమోయి రుక్మాంగదా-

దరువు-

యెటుల సేయవలెనో దాని - నెరుగ జెప్పవె మానీంద్రా- స్ఫుటము గా వివరించి బుద్ధి- దిటము సేయవే - మానీంద్రా॥దిటము చేయవే॥

వ ॥ ఆహా స్వామీ వ్రతములలో పలనెక్కువైన వ్రతమేకాదశీ వ్రతము సెలవిచ్చితిరి-ఆ వ్రతమెట్లు చేయవలెనో వివరింపుము మహాత్మా॥

దరువు-

దశమి యేకభుక్తమేకా-దశియు నిద్రా భోజనములు - విశదముగా లేదుయిలవ్వా- దశియు పారణ సేయవలయు॥ ౧

వ॥ఆహా యోయి రుక్మాంగదా దశమి యేకభుక్తంబు నేకాదశి జలపానమైన లేక యేకమనసు చేత నిరాహారులై - పగలు విష్ణుకీర్తనలు చేయుచు రాత్రి జాగరణ మొనరించి-ద్వాదశి సూర్యోదయానంతరంబున బ్రాహ్మణసహితంబుగా భోజనము చేయవలయునోయి రుక్మాంగదా॥

ఆహా స్వామి మనవి చేయుచున్నాను వినుడయ్యా స్వామీ ॥ యికనెట్లు

వోయిరుక్మాంగదా॥ ... ... ... ... *

## రుక్మాంగదవాక్యము.

ద్విపద

వినవయ్య మునినాథ విన్నపంబొకటి - కనకాంబరుండైన ఘనవిష్ణువ్రతము - తెలియజేసితివిటు తెలివిరంజిల్ల। లమీరనీవ్రతరాజంబు సకలజన సహితంబుగా నల్పగావలెనో - యనుమానము గనెనె యాచరింపుదునో వివరింపవే నాకు వేడ్కగంజిల్ల - నవిరళంబుగను నీయాజ్ఞ పాలింతు॥ *

వ॥ అహాహో స్వామి తమరుపదేశించిన యేకాదశీవ్రతంబు నేనొక్కరుండనే చేయుదునో నా పుత్రమిత్ర కళత్ర పురజనసహితంబుగా జేయవలయునో తెలియజేయుము స్వామీ॥ ... ... ... *

వినవోయి రుక్మాంగదా॥ ... ... ... *

## వసిష్ఠవాక్యము.

ద్విపద.

వినుము రుక్మాంగద వివరింతు నీకు - ఘనహరివాసరవ్రతమును దెలియ సర్వజనానేకసహితంబుగాను నిగ్రహింపగ నీవ్రతనిష్ఠ - శిశువులు పాలను సేవింపదగదు - పశువులు కసవుల భక్షింపదగదు - సర్వులుపవాస నిష్ఠతో సరియు - నీపూరి ప్రజలెల్లనిటులుండవలయు - నీరీతి వ్రతసాంత మెలమి తోజేసిన నారాయణుడు మెచ్చి నాకపదంబు - దయనొసేయునిది మది నిశ్చయంబు గాను - ప్రియముతో గావింపు పృథివీశతిలక॥ ... *

## వాక్యము.

అహో రాజా యిరుక్మాంగదా యీవ్రతంబు నీపట్టణంబునం గల సకలజనయుతంబుగా జేయవలయు నొక్క సందర్భంబు గలదు అది వివరించెద శిశువులకు పాలుపోయక పశువులకు గ్రాసంబు లియ్యక సర్వజనోపవాసంబు గావించిన నారాయణానందితమగుదాన హరిసంతోషితస్వాంతుండై నాకపదంబు నిచ్చునోయి రుక్మాంగదా॥ ... ... *

మంచిది బుద్ధి స్వామీ॥ ... ... ... *

## రుక్మాంగదవాక్యము.

క॥ అని తెలుపగ రుక్మాంగదు । డను మోదంబొదవ భటులనందరగని
యా! ఘనకార్యము చాటింపుడు । మనయూరిజనుల్ విసంగమక్కువ
మీరన్॥ * * * * *

వ॥ ఆహా యోరి చిత్రగ్రీవా మనగురుడు వైశవసిష్ఠ మహామునియాజ్ఞ
యిచ్చిన ప్రకారంబున మనపురంబున నందరికి తెలియచేయవలెను గనుకప
శుశిశ సహితంబుగా సర్వజనులుపవాసంబు చేయవలయు ననియునట్లు
చేయనివారిని నాజ్ఞచేయు నౌననియు చాటింపబంపరా యోరీ॥ *

ము॥ విడిబుద్ధి స్వామి॥ ... : *

### చిత్రగ్రీవుని వాక్యము-

దరువు- శంకరాభరణము-అటతాళము.

జనులారా వినుడిమా-జనపాలకుడు వ్రతము-సలిపినాడు-నే-మ్మినచక్తి
యుపవాస-మునను ందముననియ-మించినాడు॥ ... జ*
పాసగ బాలుర-కశనము నుబాలు-పోయరాదు వేగ॥ ... *
విశదముగాను బశువులకు గడ్డి-వేయరాదు॥ ... ... జ॥
దశమినాడొక్క- తరినిభక్షణసేయు-ధర్మమయ్యా- యేకా-దశినాడు భక్తి
ని-రశనముతో హరిని - దలచరయ్య॥ ... ... ॥జ*
వినుడి ద్వాదశినిభో- జనము విప్రులకుగా - వించరయ్యా-యిటు చేసిన
వారిని మెచ్చి-శ్రీహరికృప-చేయునయ్యా॥ ... ॥జను*
చేయకుండిన రాజు-శిక్షించుమిమ్ముల-సిద్ధమయ్యా.భావ-మీరెఱుగుడలొం
ప్పూరి-విష్ణుదేవునకిది-యిష్టమయ్యా॥ ... ... *

జతి॥ తధణాంతకధరితఝుణుతక తఝుణుకుధణ తకిటతరి- క్షీరదాభ
శరీరకః మం-దారవైరివిదార వేదో- ద్ధారసత్యాధార - మందర- ధారణా
చ్యుతధీరనుతలొం-దూరిపురనువి - హారశ్రీహరి - తాంతఝుణుకిటతంతు
ధిక్కిట-ధణతధరికరితగణనాంధరి- తకిటతకితక - తఝుణుకిటతకధమితాధి
మితకిటధధిగిణధోం॥ ... ... ... ... *

రుక్మాంగదుండు సర్వజనహితంబుగ-
ఏకాదశీవ్రతంబు సలుపుట.

ద్వి॥ ఈరీతి వ్రతనిష్ఠ నినకులేశ్వరుఁడు - నేరుపు మీఱంగ నెరపె ముదముఁ గొనుచు - సంధ్యావళీదేవి సంయుక్తుఁడగుచు - సంధ్యావిధులను సలుపుచు మూఁడు-పాదంబులను ధర్మపద్ధతి విడక- మోదంబుతో రాజ్యమోహంబువలన-ధర్మమార్గంబు గాదనక భృత్యజనుల- నిర్మలమతితోడ నేలుచునుండె - నిలమీఁద నెలకు మూఁడిష్టవర్షములు - ఫలముల వెలయుచు బహుళములు జాతి పయిరముల్ చేకొన వసుధలోపలను - నయమార్గమున నుండునవసరంబునను ఖరజనుల్ నిష్ఠమై భూపులయందు-నెరపిన ఫలము బొందఁడయ్యుండ నిర్యాసమ్యాగములు నెనసి భక్తిం బెంప-నయ్యెడ భక్తులు భక్తులరుచు జనులు రాజగృహమునకు దయమున వచ్చి - తేజంబు మిగనాడి దృఢమతి నేక - భవంబులో నొచ్చి పార్థివసుతుని - సేవయు నొనరించి స్థిరమతివనిరి॥

సమస్తజనుల వాక్యము.

క॥ దండము యోగి రుక్మాంగద। దండము రిపుమద విఘాలధ్యసుశీ రాజం
డము సజ్జన పాలా। దండము సూర్యాన్వయాబ్ధి తతశశాంకా॥
ఇదిగో పదివేల దండములు రుక్మాంగద మహారాజా॥ *

రుక్మాంగద వాక్యము -

వర్ధిల్లరోయి సజ్జనులారా॥ ... ... ... *

జనుల వాక్యము-

గీ॥ స్వామి నిన్నపంబున స్వర్గంబుల। బాధకోర్వ లేము పక్కన మీరు।
వేటలాడి మదిని వేసట బాపగా। వలయు సార్వభౌమ వలసినట్టుల॥ *

రుక్మాంగద వాక్యము-

వ॥ అహో యో యిసజ్జనులారా వైళంబుగా వేటసన్నాహంబువచ్చె

మృగబాధనివారింపుచున్నానుపాండోయీ॥ ... *

మంచిదిబుద్ధిస్వామీ॥ ... ... ... *

ఆహాగౌరీచిత్రగ్రీవా॥ యేమయ్యాస్వామీ॥ ... *

సీ॥ మంత్రులనంపరిమ ర్యాదరిప్పంపు పైనంబుజేయుముభటజనముల దండనాథులకునుదండిగానెరుగింపు సామంతవరులకుప్రేమ దెల్పు । బంధు జనంబులబహు వేగరప్పింపువిలుకాండ్ర కెల్లనుదెలియఁబల్కు । సారమే యములనపారముగా గూర్పు విరులతూరులవేగబిల్వు । రాజతంబైనసైం ధవరాజమిటుచెమ్ము వేగమెనిటుకపైనమ్ము గమ్ము-పరగనందుకొల్వులో పలికిచెమ్ము - సాహసముమీరనేటాడజనగవలయు॥ ... ... *

క॥అనయొరుసపరిచిముదమున। ఘనముగరుక్మాంగదుండుకనకపేటకచ। య్యాసభూషణాంబరంబులు । కనులకుప్రియమావహిల్లగా ధరియించెన్॥

రుక్మాంగదుండుకొలువుకూటంబునకువచ్చుట-

దరువు - అఠాణ - ఆదితాళము.

కొలువుకూటముజేరెనపుడు-రుక్మాంగదుడు-కొలువుకూటముజేరెన పుడు ॥ప॥ విలసితమృగమద-తిలకమలికమున- వెలయగభటసం-కులకలర వములు॥కొలు॥ ... ... ... ... ॥౧

పటుతరమైనవాలుపట్టి- సిద్ధాయుధువటి। కటకాంగళీయకములుపె ట్టి-భటులునటులుసం- స్ఫుటగతిచెటులత - నిటలఘటితకర-పుటులైవేడ్రము కక్కగ॥కొలువు॥ ... ... ... ... ౨

ధరణీసురోత్తములుదీవింప - కొలువున్నభూ - ధవులుతనుజేరినుతి యింప। గరుడతురగము-హరకరుణాకర-నరహరియనిసం-స్మరణజేయు చుండ ॥ కొలువు॥ ... ... ... ౩

సారసాక్షులునటనసేయ - కంచుకులుతను - జేరబరాబరులు సే యు । వారిజాక్షు అరవిందారి విహారపు - దారి వినుతయాని - సాకెక నెన్నుచు॥ కొలువు॥ ... ... ... ౪

జతి ॥ మిత్రనయనకవి - మిత్రగర్వితా - మిత్రహరణస - గ్గోత్రదేవ
కీ - పుత్రనాటక - సూత్రరైవత - గోత్రభరణనిను - కమరుగదలచిర్ఘుం
తణకిట్టకర్ఘుం తరికిట్టకనంపనంపనాకుందొకిట్టక - సారసాక్షులొంద - దూరి
పురీవ - పాలనేణుగో - పాలసురాదిజాతతధిలాంగుతైతధిలాంతకతాద్రైతక
ధత్తధాం దిం దిందతకధాధిట్టకధాధిట్టకతతకతధిమిది మితధిమితకదధి
గిణధోం॥ కొలువుకూటము జేరెనపుడు॥ ... ... *

రుక్మాంగదుని - వాక్యము.

క॥ ఈవిధమున జనిచిత్ర। గ్రీవాయిటు రమ్మటంచు గృపతో ననియెన్ । వే
వేగ పటజనపతె । రావలయును సకలభటులు రభసము మీరన్ ॥ *

వ ॥ ఓరీ చిత్రగ్రీవా జాగ్రతగా వేటలాడబోవలయును గనుక సమస్తప
రివారంబులు రప్పింపరా యోరీ॥ ... ... ... *

చిత్రగ్రీవుని - వాక్యము.

ఓస్వామీ తమయాజ్ఞ ప్రకారము సమస్తజనులు కొలువునకు వచ్చియు
న్నారు సెలవు ॥ ... ... ... ... ... *

రుక్మాంగదుండు వేటకు పోవుట.

ద్విపద.

అనిపల్కి రుక్మాంగదాఖ్యవిభుండు - తన తేజినెక్కి కత్తళము సొడి
గి - నడుమును బిగించి యానంబు సేయించి - కడుభీకరంబైన కట్టిర్ఘోష బొంది -
భేరీమృదంగాదిభేరీ ధ్వనులు - భోరుకొల్పుటకును భువి పెల్లగిల్ల - చామీక
రపు గొడుగులిరుగెల - తోమర ముసలబంధుర కరవాల - పరశుపట్టసములు
భటులు చేబూని - యడుగడుగాదనుగొల్వ నధిక రోషమున సారమేయంబా
దిజంతుజాలంబు - లారయసదువ ఘోరాటవిజొచ్చి - సింహంబులను జూచి
చేవాలు మాటి - గహ్వరంబులదూరగానుగజేరించి - పులులను బోనీక పొద
రిండ్లు దూరి - కలగిరులందగాగూల్చి యుదల్చి - సూకరంబుల బట్టి సుడిపడ
గొట్టి భీకరమృగములబిడంబులణచి - జంబుకంబులద్రుంచి చమరులనొంచి

శంబరంబులజించిచండతమించి- వేటసన్నాహంబువేడ్క-చాలించి- వాట మహానుభ్యానవనికేగుదెంచి-బడలికదీర వృపాసన్నుపై జేరి - తడయుకనిర లోదకములద్రావి - భాసురతోండూరిపట్టణాధిపుని - వా సమీరగ చాల వర్ణింపుచుండె॥ ... ... ... ... ... *

యముండుబ్రహ్మసభకుపోవుట-

క॥ అసమయంబునశమనుడు। భాసురముగదున్ననెక్కి పటుకింకరు
లుగా।వాసిగగొల్వగనాకమ। లాసనుసభజేరవచ్చెలావణ్యమునన్॥

దరువు రాగం - ఆరభి - అటతాళము-

దండధరుడువచ్చెను- బ్రహ్మనుజూడ- దండధరుడువచ్చెను॥ప॥ దండ
ధరుడువచ్చెను-దండముతోడబ్ర-హ్మాండమునజనులెల్ల-గుండెలలిసిచూడ
దండధ॥ ... ... ... ... ... ౧

దండపాశములు- దండిగాధరియించి - మెండుగగింకరు - లండజేరికొ
ల్వ॥దండధ॥ ... ... ... ... ... ౨

రంగైనతుండూరి-రాజీవాక్షునిభక్తి -పొంగిచెలంగురు-క్మాంగదుక
థచెప్ప॥దండ॥ ... ... ... ... ... ౩

యముని- వాక్యము-

క॥ శరణుసురాసురవందిత।శరణురమాపతికుమార శరణుసురేశా।
శరణు చతుర్ముఖరూపా।శరణుకృపావేశసత్యజనసంకాశా॥ * *

వ॥ఇదిగోపదివేలవందనంబులుమహానుభావా॥ ... ... *

బ్రహ్మదేవుని - వాక్యము-

దీర్ఘాయుష్మంతుడవైవర్ధిల్లవోయివైవస్వతా-యేమిపనికైవచ్చినా
వోయికృతాంతా॥ ... ... ... ... ... *

యముని వాక్యము-

మనవిచేయుచున్నానువినుడయ్యాస్వామీ- ... ... *

ద్విపద.

వినవయ్య నేజేయు విన్నపంబొకటి - కనినదివినినది గాదిట్టిచింత- తన కెనుబంచత్రిభైర్యమానఘుడు - అరుదైనరుక్మాంగదాఖ్యుడౌనృపతి - పరిపూర్ణుడై విష్ణుపదములనమ్మి - హరివాసరవ్రతమధికనిష్ఠ క్రి- తానునుజే యుచుధరణి పాటింప - గానుసువ్రతనిష్ఠగల్గివేడుకను - గావింపబడు శిశుకాంతలతోడ- వేవేగవైకుంఠవీథులయందు-శ్రీహరియుక్తులై సగవైభవముల- నూహచేసున్నారుచితమటయ్య-ధారుణిరుక్మాంగదాఖ్యవ్రతము- నేరీతినైననమ్మటుసేయకుండ జేయుముకాదేనిచెప్పెదవినుము - నాదెడ దయయుంచివలినసంజాత-యూపాశమీదండమీకింకరులను - నేపాధకైకొను మేలమిళోర్వు- నీనుతపంబునకేగెదనయ్య- ... ... *

బ్రహ్మదేవునివాక్యము.

ఆహా యోయియమధర్మ రాజా -నీవుచింతసేయపనిలేదు - నీమనోనుసారంబుగాకార్యంబునెరవేర్చెదనీపట్టణంబునకుంబోయి సుఖంబుగానుండుము యోయివైవస్వతా॥ ... ... ... *

చ॥ అనియిట్టుబ్రహ్మదేవుడురయంబునయోచనచేసి సర్వమో। హాన యసమాస్త్ర, మోహితవిహారిణి సుందరదివ్యకన్యకా। జనజితమోహ నాంచితవిశాలమతిన్ గ్రమచేజెలంగుమో-హినియనునొక్క-దానిస్ఫుర యింపచె బ్రవీణతచేజరిల్లగన్॥ ... ... ... *

వ॥ ఇవ్విధంబునసృజియించినయా కన్యకమదనుండౌరజెరికి - రక్షించినకరుకుబాణంబువలెనిలువంబడిదండప్రణామంబులాచరించి తండ్రీనన్నుగల్పించినకార్యంబేమియానినధాతయిట్లనియె॥ ... *

క॥ తరుణీవినురుక్మాంగద। ధరణిపుడేకాదశీవ్రతముసేయగనీ। వర యగనావ్రతదినమున। సరసగతింగూడిరమ్ము శమనుడు మెచ్చన్॥

వ॥ ఇట్లుచతుర్ముఖుం డెరుంగించినన మ్మోహినీదేవినవయౌవనారంభసంభూతురాలై రుక్మాంగదుండు వేటాడి వసియించియుండినవుద్యానంబునుజేరి॥ ... ... ... ... *

## ద్విపద.

శ్రీరమ్యగుణధామ శృంగారసీమ- లావణ్యమోహినీ తరుణీలలామ- చందనకర్పూరసహితోదకములఁ - నందమౌజలకమింపలరగాఁజేసి - జలతారు మొగ్గలుచక్కఁగాఁదీర్చి - సిరిమించు తెలిపట్టుచీరఁధరించి - జంటిమొగ్గల చేర జతగూర్చియున్న -కేటికింపగుపికెయుదాను గొడిగి-కురులుదిక్కఁడలింగి కొప్పునమర్చి - చురుపంపువిరులు ప్రేమయొనర్పఁదాల్చి-యరచంద్రునమము గానందమౌ నొసట - గరిమకుంకుమబొట్టు కలికి తా బెట్టి- మెరుపుతీగెనఁదల్చు మేలత నెమ్మేన - పరిమళగంధంబు బాగొప్పఁబూసి - వనజంబులను గేరుపనితకన్నులను- పునుగుకాటుక రేఖపొసఁగఁగాఁదీర్చి- సీమంతవీధి పైచెలువఁగలింప - ప్రేమపాపటబొట్టు ప్రియములుగుల్క - రాకడియును సవరసుపుష్పిదాల్చి - వీకగేదఁగివిందివీలు నమర్చి - శ్రీకాంగముల మించుచెలియకర్ణముల - జోకరత్నముల పంజులకమ్మలలర - బుగడలు బావిలీల్పొలుపొందసొమ్ము - లగణితంబుగ నిడియతిమోదమొదవ - పొత్తుకునంపెగబోలు నాసికము-న్నతుకెన్నొప్పైనటనంబు సేయ - దరముసుందరముబోనరము కంఠమున - సరిపెణ లడ్డిగెల్పరములు దాల్చి - కరికుంభములబోలుఘనకుచాగ్రముల- నరుగైనహారములలరినటింప - నళిననాళములబోలు నాతిబాహువుల- చులకించుబాజుబందులు ప్రకాశింప- పొలుపొందుకిసలయంబులమించుహస్త - ములకటకోర్మికంబులు చెన్నుమీర - సింగపునడుమన చెలఁగుమధ్యమున - రంగైన మొలనూలు గహాని జెలంగ - మరనుకటారుచీమలబారుగేరు- సుకళినూగారు భాసురగతి గుల్క-నరటిస్తంభంబులనందంబుగేరు- గరితపెంగొడలు బంగారుహసింప- కమలగర్భమ్ముల చక్కఁదనంబుమించు- నలివేణి జంఘికలందమింపెసఁగ- చెలువైనతాబేటిచిప్పలరీతి - వెలయుపదాగ్రముల్వింతలుదేర - నడగిచుక్కలమించు నఖములకాంతి - కడు వేడ్కఁబుడమికిగంధంబు బుయ్య - కలికిపాదంబులగజ్జలందెయలు- ఘలుఘల్లుమని కాళ్లకడియములుమ్రోయ - వేడుకతోఁదమారివెన్నుని దలఁచి-యాడుచు పాడుచునటఁజేరవచ్చె॥ ... ... *

మోహిని వాక్యము-

దరువు-శంకరాభరణము-అటతాళము-

జలజాక్షి విరహము-సైరింపలేనమ్మ-వెలదులార ॥ పలుగాకికోయిల
పలుకుల కేనోర్వ-భామలార- ... ... ... *

మదనుని వాడికి- మానలేదుగదే- మగువలార యీ-మ్మెద గొండలకు మది-
బెదరెనుగదరే యో-ముదితలార- ... ... ... *

చిలుకలరవములు-చెవులసోకితో చెవిసే-చెలియలార-యీ-మలయస
మీరము-చెలియిరవజేసెనే పొలతులార- ... ... *

రంగైన తొండూరి-రాజీవాక్షునితో జే-రవలెను లార- రుక్మాంగదుజూ
పరే-సంగతిమీరగ కాంతలార॥ ... ... ... *

వ. ఓ చెలియలారా యీ విరహభరమ్ము నమ్మురమై తోచుచున్నది
రుక్మాంగద రాజేంద్రుండెచ్చటనున్నాడో చూపరమ్మా॥ ... *

క॥ అంగన నీ వెవ తెవు రుక్మాంగదు పేరెత్తి పలుక కారణము నునీ। సంగతి
యును నీ పేరును। గంగగ తెలియబలికి రాజీవాక్షీ॥ * *

దరువు-నీలాంబరి రాగము- ఆదితాళము.

అంగనలార మీ-రంగజు సాటియా- శృంగారుడౌ రు-క్మాంగదు జూపరే-
నేతాళలేను॥ ... ... ... ... *

మనసుదు గేనగి-గొనిగొని నాయెద-గుదుము గాసుమది బెదరిచెదరె
నమ్మ-నేతాళలేను॥ ... ... ... ... *

సుందరమగువాని-యెందు జూచెదనని - యిందువదనలార- యిందువ
చ్చితినమ్మ-నేతాళలేను॥ ... ... ... *

అండజగమనరో - తొండూరి కృష్ణుని-నిండు మదినినమ్మి - యుండవని
చూచుచాక-నేతాళలేను॥ ... ... ... *

ద్విపద.

వినరమ్మ చెలులార వివరంబుగాను - ఘనమైన నాపుట్టు కథ నెరుగింతు-

నలినగర్భానకుమానసపుత్రినగుచు-విలసిల్లుచుండగావిబుధులుమునులు-
దేవతలస్వర్నదీదేవులుసిద్ధ-లేవిధంబుననైననింతినిమన్నుచు - మాతండ్రినడి
గినమదిసంశయించి-యాతన్వినెవ్వరినేమివరించు - నాతరుణపురుషుడీనా
తికిననుచు - చేతోముఖంబునచెప్పిపంపగను - నెవ్వరిబొందెదవేతరళా
క్షి-నివ్వటిల్లనప్రేమనెరుగింపుమనిన - భావించివారితోబల్కెలతినొకటి - దే
వేంద్రునొల్లసుదివిజులనొల్ల - కిన్నరగంధర్వగీర్వాణయక్ష - పన్నగాదుల
నొల్లపశుపతినొల్ల - భూలోకమునకేను బోయెదననుచు - లాలితంబుగబ
ల్కెలావణ్యమెసగ- పశ్చిపట్టణములవరుసగానేను-జొచ్చిసుందరులయ్యు
షోడశకళలు-గలిగినరాజశేఖరులునులేక -కలకంఠికోవినుకలిత లావణ్య-
శీలవసంతజగంతులిక్ష్వాకన్న - నలకూబరునికన్న సనజిల్లుకన్న - రూప
శోభోన్నతరూఢిసౌఖ్యముల - భూపాలశేఖరుపుణ్యచారిత్రు - తొండూరి
కృష్ణునిసొలగకగొల్చి- నిండినమదినుండునిరుపమాకారు - దశదురుక్మాం
గదుడనుపేరువాడు-పతగకులేశుండు ప్రకటబలుండు - నీవనంబునచరి
యించునటంచు- పావనంబుగజూడవచ్చితిగదవె - యూహావిలాసంబును
చిత్తోత్కెగల్గు- మోహినియందురుముదితనాపేరు॥ ... *

దరువు-నాథనామక్రియ- జంపెతాళము.

పోదాముపదరేయోయమ్మ- వనము- మోదమెల్లనుజాచి- మరియు
దమమ్మ॥పోదాము॥ ... ... ... ... ౧

చైత్రమాసముగదవేకొమ్మ-మనము- చిత్రమగుపుష్పముల - చెలగు
నోయమ్మ॥పోదాము॥ ... ... ... ... ౨

శృంగారమగుఫలములను- నలరు-క్మాంగదునిజూడగ - కడుమోద
మునను॥పోదాము॥ ... ... ... ౩

అల్లతొండూరిశ్రీహరికి - మంచి - మల్లెపువ్వులుబేను - మనసారమెు
దికి॥పోదాము॥ ... ... ... ... ౪

తీ చూడవే॥ కొమ్మ॥ ... ... ... ... ౩

ఇంటికి జూచి వా-ల్గంటులతో బల్కు - తుంటతనము లేల - దొరవై తే మంచిదే॥ కొమ్మ॥ ... ... ... ... ౪

సారసముఖులను-జేరిపలుకతాం - దూరికృష్ణునిజత - చేరియున్నాడే మో॥ యె॥ ... ... ... ... ... ౫

రుక్మాంగదవాక్యము-

క॥ అనిపల్కగ రాజేంద్రుం। డను మోదము పల్లవింపనతివా బలుకు హెచ్చినప్రేమగలదు నాపై। ననుమానము లేల కలయు మనంగజు కేళిన్॥ *

మోహినీవాక్యము.

వ॥ ఇటుల బల్కగ విని హితమైత్రి వెలయ- కుటిలకుంతలి జూచి కొమ్మరో వినవె యో యమ్మ యీతని యూరి పేరేమొ- న్యాయమా యిట్లాడవలెన నేత్రులను-నెలతరో మగవారి నెరుగనినన్నా - పలు చెరంగులు గాగ బల్కుచున్నాడె-యీ రాజు పేరేమొ యిటేరా చేరి నన్నిట్లాడ జెల్లునటమ్మ- పెండ్లిగా నట్టి బింబోష్ఠి జూచి-యిండ జేరుమటంచు నడుగ తగు-మగని వారి మాటలు మరనమ్మ రాదు- తగిలిన వెనుక మెత్తన జూతుగమ్మ- పుడమి రాజుల పొందు పాటింపతగదు గుణములో జనుమని గురి జెప్పనమ్మ॥ *

రుక్మాంగదవాక్యము-

సంధి- వచనము-

అనిన మోహినిగని రాజేంద్రుండిట్లనియె॥

ద్వి- ఓ మానిని మణి యో ఘనవేణి - యో మందగజయాన యో కుందరదన- యో కీరసల్లాప యో చంద్రవదన - నాకథ నెరుగింతు వినవె లోలాక్షి - యీ విదేశాపురంబేలెడి వాడ -వేవిధంబుల నైన విష్ణుసత్కీర్తి - సేవించి యేకాదశీవ్రతనిష్ఠ గావింపు వెలయు రుక్మాంగదాధిపుడ-వేటాడి మృగముల వేడ్కరంజిల్ల - వాటమౌ యీ వనవాటిక జేరి - కాంతరో నీ మృదుగానంబు చెవుల

వింతగా వినిమారువేదనబూని- యిట్లువచ్చినిను జూడ హెచ్చెవిరహము
కుటిలకుంతలి నాడుకో కేశరబిల్లి -దయయుంచిన న్నేలుతరుణీలలామ- న
యముగాలోంచూరినరహారియాన॥ ... ... ... ౯ *

## కాంబోధ్యాగము - శంకరాభరణము.

క॥ వనితా నీవెవతెవెయీ - వనితావునచేరిమిగలవన్నె గలిగియే- వ్వ
నితావునసుఖమొందగ - వనితాయిటువచ్చినావో ॥ వనరుహనేత్రీ - మన్మ
థమో - హనచారుగాత్రి-మనసీజునకిరవైనయీశుభ -వనములో బూబా
ణ్వుమీదను - గనికరము గ మనమునను బెన - గొనగంతి సుఖమెనయున్నా
తో ॥ వనరుహ నేత్రీ॥ ... ... ... ... *

## మోహినివాక్యము.

క॥ ఏ రాజవర్యులైననుసే-రాజీవాక్షులతో నుసిటుపల్కుదురా మా
రాజనేలుకొమ్మని - మారాజనినెనయుదాక మారాహుజీరా - రాజులకి
దియుమేరాశ్యంగారా- కోరికతోమగవారుకోరిన - వారకాంతనుబట్టి
నటువలె- సారెసారెమనిటుల బలుకను - మేరయేమినువంటివారకి ॥ మా
రాహుజీరా-రాజులకేదియుమేరాశ్యంగారా॥ ... ... ౨

## రుక్మాంగదవాక్యము.

గ॥ కలవాణిమగలశీలము- కలవాడనుభిక్షుభక్తికలవాడనుపో - కల
మాటలేలనాంగో - గలకంఠిమోహములగలయ వెకొమ్మా-శృంగారము-
కలిగినబొమ్మా - చిలుకలంగనుగోకిలములలుకను - గిలకిలస్వనములనుబలుక
గ -నలరువిల్తునికరుకుటమ్ముల- కలికినామదినిలుపజాలను కలయవేకొమ్మ
శృంగారము- గలిగినభామ్మ॥ ... ... ... ... ౩

## మోహినివాక్యము.

క॥ హరిభక్తిగలుగువారికి - హరిమధ్యలచనువు లేలనయ్యాయలక్ష్మీ-
హరియచటమగువలెచ్చట- హరిహరియీాచిత్రమేమి॥ హరిసమతేజా-రు
క్మాంగదవసుధభోజా॥ సరసగతినిటువనమునందును-దిరుగుచుండెడిసర

సిజాతులు- దురుసుతనమునబలుకతొండూరి - పురిహరికినిది పరుసదనమ
గు-హరిసమతేజా-రుక్మాంగద॥ వరనృపభోజా॥ ... ... ౪

మోహిని వాక్యము-

సీ ॥ వనవిహారమునస్లవచ్చినకాంతలనిటువల్క-మీకువిహితమదౌన మందరంబైనట్టి సుందరాంగులజూచి భ్రమజెంది యెనయుటపాడియౌన। యేమియెరుంగనిభామామణులమీద గామించిపల్కుటఘనతయౌన। పురుషులొద్దను లేనిపొలతులగనియిట్లుపలుమాటలననీకుభావ్యమౌన। మనసు తెలియకయిట్టిమర్మములువలుక। చెల్లదెవరికినీవను జెల్లెగాక। యెవరువత్తురొవిందురోయ నెడుభయము। లేకయిట్లాడమీకువివేకమౌన॥ ౫

రుక్మాంగదవాక్యము-

సీ ॥ కోకిలకంఠినీదుపల్కులువిన్నయదిమొదల్చిల్క-వల్కులునాదుచెవినిజొరవు। కనకాంగినీదేహకాంతిజూచినవెన్క-నీత్రీవలనుజూడనింపుగాదు- వన్నెతనీ మోముకన్గొనినదిమొదలుసోమునిజూడగానాకుమనసురాదు- ఘనవేణినీమందగమనంబుజూచినహంసతిలకింపనలవిగాదు - నిన్నుజూచినవెడఏంటిమన్నగోరదు - మోహమెందును గదపె యో మోహనాంగి-తరుణినీమోవితేనెతో దప్పిదీర్చి - సరసమొదవగరతికేళిసలుపగదవే॥

మోహినీరుక్మాంగులవాక్యములు-

దరువు- శంకరాభరణము- ఆదితాళము-

మో- అవురాయిూరీతినాతో- నందురామీవంటిదొరలు- పొరులీమాటువిన్నిన బకపకనగ్గ- ... ... ... ... ౧

రు - నగిననేమాయెనునీదు - నగుమోముముద్దులువెట్టి- వగలాడినాతో బొంకనే- వంటిపాటును- ... ... ... ౨

మో - ఒంటిపాటుమాచినేనే-యుర్విలోగ్రడింపుచుండ జంటకురమ్మ

నే నేమి-తుంటతనమున- ... ... ... ... ౩

రు- తుంటవిల్తుబారికేను-నొంటినుండజాలమోవి - వంటనొక్క-నీయ

వేమి పలుమాటలేల- ... ... ... ... ౪

మో - పలుమాటలుననునీవు -పలికేదురాజేంద్రనీవు- వెలదులునన్ను

జూచిన- యలుకనందురు. ... ... ... ౫

రు- చులుకగనీవుపల్కిన - వలరాజుబారికోర్వనే - కలికిగుబ్బలెదను

జేర్చి - కౌగిలియవే- ... ... ... ... ౬

మో - కౌగిలించినీతోరతి - కలయునట్టివారలేర-యూగడమ్ములుచేసి

నా-యండజేరకు- ... ... ... ... ౭

రు- అండజేరిచెక్కునొక్కి- పండిగాగ్రేడింతుగాని-తొంతూరిక్రృష్ణ

నితో జే-తాలగనీయనే- ... ... ... ... ౮

సం॥ గీ॥ ఇటులరాజేంద్రుడనగ మోహానిముదంబు - జెంపచేజక్కని

కమీదజంతలేల- ననిమనంబునదలపోసి యూన్నపాలు- నట్టికనుగొనివగమీ

గనిట్టులన్నదె. ... ... ... ... * *

మోహినివాక్యము-

ద్విపద-

ఓయిరుక్మాంగదయో రాజవర్య - న్యాయమాయిట్లాడనాతోడనీవు-

సూర్యవంశంబునసారదిజన్మించి - యార్యులుగొని యూడ నాగూఢికెక్కి-

జగతిలోదనయిచ్చజరియించుసతుల - వగలు సేయగనిటువచ్చిపొమ్మనెద

వెన్నడునాముఖమెరుగవునీవు-నిన్నిచందంబులహితవుపల్కెదవు- కంటి

కింపైనచక్కనిగుమ్మననుచు-గంటుమాటలబ్రొద్దుగడిపెదవేమి - వరధర్మ

పద్ధతివర్జించియిటుల-బరభామినులబట్టబాడియేనీకు - నింపైనభామిను

లేతెంచిరాజు-పొందికగోరియిపొందగూడెదరు -గానీవలెముద్దుకాంత

లజూచి- మానంబువిడిచిరమ్మనున్నృపులలరే - యేలయీవగ మాటలేలనా

తోను- లాలించిపల్కె-దుఃఖాపవంబుగను- రాజులేయిటులధర్మంబుపోద్రో యు-భూజనుల్నడవంగఖోవ కేతలపనసదృశ సౌందర్యలావణ్యలుఘనులు రసికజ్ఞులైనట్టిరాజపర్త్యులను - వనితలు మోహించివచ్చి రేనియును - బనిదీ రు వెనుకచివ్వనజూతురేలమి - గానతొండూరిచక్రి నికృష్ణుతోడు- మాని నుల్ రాజుల మదినమ్మరాదు॥ ... ... ... *

దరువు - మోహనరాగము-అటతాళము-

న్యాయమేమయ్య-రుక్మాంగద- న్యాయమయ్యా-॥కాయజుబారికి- కా యముసొలసిట్లు- పాయముకొంకల-పాయకయిటుదాయ॥న్యా॥ ౧

మగనాలితోడ్రప్రే- మగ్గనివిట్లు మగడువద్దలేని - మగువల మోహం వ ॥ న్యాయ॥ ... ... ... ... ... ౨

వనమూలజరియించు - వనజాతముఖులను-వనగుగనెనయఘా- వనకా దురాజేంద్ర ॥ న్యాయ॥ ... ... ... ... ౩

నగరాజధీరమీ-నగరిలోపలనుబ- న్నగరాజవేణులు- నగరాయీవగ జూచి॥న్యాయ॥ ... ... ... ... ౪

శ్రీరమణీశతొం- డూరిశ్రీకృష్ణపద- నీరజములమది - నారాధించినదా న॥న్యాయ॥ ... ... ... ... *

రుక్మాంగదవాక్యము-

ద్విపద-

ఓసఖి మోహిని యో మందయాన - నీపాటివగలాడి నెందునుగాన- జెలి యరోనిన్ను జూచినయటనుండి-తలిరాకువిల్తునిదాడికివోర్వ- జాలనునన్నె లు సరసిజనయన- యీలాగుతమి రేప-హితమానెనీకు.నలినాక్షిదయవుం చినను గౌగిలించి - పలుకులసొల యించి భ్రమలుగల్పించి - యుపరతినెన యించియూహాలుపెంచి - నిపుణతవెలయించినిటుసమ్మతించి - మోవితేని యలిచ్చిమొనగుబ్బగ్రుచ్చి- కామరోనను మెచ్చిప్రౌఢిమహెచ్చి- కూడవే

నుతో యజమిత్రుడుత్రోవదప్పినఁగా । మనమునననిన్నుఁబాయననుమానము
లేలనునమ్ముమోహినీ॥ * * * * *

రుక్మాంగద-వాక్యము.

ఓ మోహినీయగ్నిచల్లనైననుసముద్రములింకిననుమేరువర్వతముపొడియై
నను - నాదిశేషుడు ఫణములువంచినను అష్టదిక్కులుతునియలైనను ని
న్నెడబాయను- తడవుసేయకనమ్మవేచెలి॥ ... ... *

మోహినివాక్యము.

దరువు-హరిహరప్రియరాగము-ఆదితాళము-

నమ్మితినిజమ్ముగకా- యమ్ము నీదుసొమ్ము గా నే-నమ్మితి॥ ఓరోరిసామి
నమ్మితి॥ ... ... ... ... ... ౧

బాళిమీర బూలవిల్తు-గోలలకు నేదాళలేకను॥ నమ్మితి॥ ౨

కోరికలగమారుకేళి-జేరిసుఖము జెందుటకు నే॥ నమ్మితి॥ ... ౩

చారుతులసీహారుడౌ తాం - డూకృష్ణశౌరితోడ॥ నమ్మితి॥ ౪

క॥ అని మోహినిపల్కినమం । తనమునరాజేంద్రుడలరితనచెలికని
యోగ్యవనిలామృదుతల్పముగా । బ్బినతాంబూలంబుగంధములుగూర్చు
మనఁగ॥ * * * * * * *

సీ॥ గంగిణీవవికొంగోబంగారుమంచంబుపైసన్నజాజులుపరుపుదిండ్లు। క
స్తూరిపునుగుబుక్కాపొడిపరిమళ గంధంబునించుబంగారుగిన్నె । సౌర
భంబెసగుపన్నీరుగంధపుసూనెబోసినగిండ్లకర్పూరగవిడెము। లతిరసంబు
లు మొదలైనఫలాహారములునమరినపళ్లెరముజెలంగ । కమ్మనైనట్టిశీతో
దకములచెంబు-నిరుగెలంకుల బాగుగానీపుగుల్కె। గరిమవైభవములు
మీరగానమరి। తేజమలరగరాజుతో తెలియబల్కె॥ *

వ॥ ఓస్వామీ రుక్మాంగదరాజేంద్రా తమయాజ్ఞప్రకారంబున-జనినా
ప్రజ్ఞమీరియుద్యానంబుసఖద్యోతప్రకాశమానంబగు మందిరంబుననుంద
రంబుగావిరిపాన్పునమరిచి తదనుకూలమైనద్రవ్యముల సమకూర్చినాను

ాశేంద్రతిలకాయనివిన్నవించిన॥ ... ... ... *

రుక్మాంగదుండు మోహినింగూడుట.

క॥ మదనుడుశరములుగదుమగ । పడపడి మోహినికకంబుపట్టెన్ప్రా
ంగ।డపదిదిపద వేవద వే। పదవేగంబనుచుబాన్పు పజ్జకుజనియెన్॥ *

ఉ॥ ఈతరుణిన్వరించెమదికింపుగ రాజుమునవ్వయుండు మో। హాతు
రుడయ్యు మోహినిసహంబునగూడుడుతానునున్నప్ర। ఖ్యాతముగాస్వకీ
యకులకార్యవిహీనుడుభానుడంచునన్। జాతఘునందుపట్టునిశీథుప్రమొ
వర్తితునాథిగ్రుంకెనన్॥ * * * * *

ద్విపద-

ఈరీతిపద్మినీహితుడుగ్రుంకుటయు- నారీలలామపైనటినా వ్రతులజా
డనురాగమొందెనోయనగెంపెసగ- ఘనముగాచెల్వంటగగనభాగము
నగరిత్తపై మోహాంధకారంబుమీరె-నగణికులుండనతమసమింపాండ-నా
తిథమ్మిల్లంబునవపువ్వుగ్డిన-ఖ్యాతిగన్పించెనక్షత్రముల్మింటనుతినెమ్మో
ముతోజోడైనకరణి - పడపడిచంద్రుడింపారజూపట్టె- కలికిలేనవ్వుప్ర
కాశించెననగ- వలనొప్పవెన్నెలల్వసుధపైనిండ-రాజును మోహావిభ్రాం
తితోజూచు- రాజునగువలయంబులువికసించె - భూపతి మోహినిపాండె
నెచేయు- జాపనెలసటంముపొరిదిమన్మథుడు - బాణసంధానంబుసడించెన
నగ - నాణెమౌకమలముల్ నత్రముల్మొగిచె - వన్నెచకోరముల్వనితల
గూడి- వెన్నెలభక్షించువిధమునరాజు- మోహినిపర్యంకమునజోడుగూ
డి-మోహాంబుచిగురొత్తమువితయుదాను-ఫలహారమునరింపిపరిమళోత్
కేకము - లలరుచుద్రావినేత్రానందముగను - గంధంబులలదిబుక్కాడిపైజల్లి-
పాంకకమీగతాంబూలంబుచేసి-విశదంబుగాదశవిధమంబనముల- పొసగిం
చికంచుకంబునుసడలించి - పలుకులసొలయించిభ్రమతప్పించి-కళలూగ
గోగించికలసిమేలెంచి- గాంధర్వవైవాహికంబునరాజు- బాంధవ్యమొ
నరించెబడలికోనంత॥ ... ... ... ... *

చ॥ తెలతెలవారెజంద్రికలు తేజముడంగగమించెచీకటుల్। వెలవెల
నయ్యెకల్వలునువేడ్కఁజెలంగెననీరజంబులుఁ। కలకలమానెపక్షులు
నుగార్మ్యకముల్ సడలించెమారుతుఁ। బలపలనయ్యెఁజుక్కలును భానుడు
దోచెనుతూర్పుదిక్కునన్ * * * *

క॥ ఘ్రాలిమితోనిటుప్రాతః। కాలముజనుదేరభట్టులుఘనతగభే
రుల్। మేలని(మ్రోవగభూపతి। మేలుకొనుచునిత్యకృత్యమిచేసెఁజనెన్

మోహినివాక్యము-

అంత మోహినీభామ- చెంతనుండెడిచెలికత్తెంగనుంగొనియో కాం
తా భూకాంతునితో స్వాంతంబలరనింతగా గ్రీడింపుచున్నంతలోనెంత వేగ
ము తెల్లవారెనమ్మా॥ ... ... ... ... *

దరువు-జంఝుటి ఆదితాళము-

ఎంతవేగ తెల్లవారె- నేమిసేతునమ్మ నేను ॥ కాంతుఁడైనరుక్మాంగదుని-
గలసిపెనగునంతలోనే॥ యెంత॥ ... ... ... ౧

మక్కువతో మదుపలిచ్చి - మమతతో బిగువుకౌగిట - పక్కఁజేరిచె
క్కునొక్కి-పైకొనియుండెడివేళ॥యెంత॥ ... ... ౨

కొదమగుబ్బలెదనుజేర్చి - పెదవితేనెలానిమదికి-ముదముతో బంధవై
ఖరుల- మొనసికూడునంతలోన॥యెంత॥ ... ... ౩

వారిజాక్షుడైనట్టితాం-మారికృష్ణమహామలేమో - మారుకేళిచెలి
పొంగను-మీరిసుఖము జెందునప్పుడె॥యెం॥ ... ... ... ౪

క॥ ఈరీతి మోహమందగ। భూరమణుడువచ్చిచూచి పొలతీవనముఁ।
జేరిభ్రమింపగనెందుకు। నూరికిజనిసుఖముతోడనుందము చెలియా॥

రుక్మాంగద-వాక్యము-

ఓమగువా యీయహితంబైనయీవనంబున మోహంబుమీరిసుఖం
బుజెందకారణంబేమి - మనపురంబునకుంబోయి ముదంబుననుందముపద
వేకుందరదనా॥ ... ... ... ... *

## రుక్మాంగదుండు మోహినితోఁ గూడి తనపురంబు చేరుట.

### ద్విపద.

అనవల్క సూర్యాన్వయాబ్ధిచంద్రుండు - తనభటావళి వేగ తడయక కూడి - మనపురంబునకు ప్రేమమ జనవలయు - నని నచిత్రగ్రీవుడను వాడుద్ది వ్య. ఘనకేతనాంచితోత్కరభాసమాన - వినుతమహాహయముల వేడ్కనుబూన్చి - లలితాష్టచక్రవిరాజితసుమణి - కలితమారవమునక్కడికిదోచ్చె - మారుండు రతిఁగూడి మరిరథమెక్క - తీరున రథమెక్కి దినకరాన్వయుడు - మోహినిసహితుడై మోదముతోఁ గదలి - సాహాయ్యానినాదంబున లుప్పుచు భటులు - భేరీమృదంగాది భీకరధ్వనుల - ధారుణీతలము మోదంబును జెంద భటగాయకానేకబహుమంత్రివరులు - నిటలస్థహస్తులై నెరసితగ్గొలువ తనవిదేశౌపురితడయక చొచ్చి - మనుజేశ్వరుండంతమందిరంబునను - వేగంబవచ్చియా వెలదినిసకల - భోగాస్పదంబుగా బొలుపొందుచున్న - యొకచంద్రశాలలోనుంచి వేడుకను - సకలసౌఖ్యంబులసలుపుచునుండె.

క॥ సుందరముగ రుక్మాంగదు। డిందువదనతోడఁ గూడి హితవృగనుండఁగ। బొందుగబురపిథులకే। పందరు హరివాసరంబున నిన టింపఁగ॥

రుక్మాంగదుండు హరివాసరంబు సాటించుటవిని మోహిని విడిచి వ్రతంబునకై తనయింటిని చేరుట. ... ... ... *

చ॥ ఇటువలెఁ జాటగా నృపతియుంపలరన్వినిశయ్యబాసితా। తటుకున లేచి కృష్ణవరదాచ్యుత శ్రీహరి నారసింహావి। స్ఫుటపటుకూవకేశవవిభో మధుసూదననిన్నునెప్పుడుః। ద్ఘటిమరువంగజాలననితీవ్రతతోదనయిల్లుఁ జేరఁగా॥ ... ... ... ... ... *

### దరువు - మధ్యమావతి - అటతాళము.

అందమలరబల్కెను - రుక్మాంగదు - డందమలరబల్కెను॥ అందమలరబల్కె - ముందుభటులఁజూచి - పొందుగా వివరించి - భూపాలడాముసు - లం

దారవిలిపించెను- వారలన్నుని- పొందగా సేవించెను-భక్తి తన-దండంబున
నుంచెను-పూజల- నందముగగావించెను-హరివాసర- మిందువసించుడు
మీ-రందరనుచువేడ్క - జెందిభాగ్యముల జె- న్నొందిన్నపాలుడు- అంద
మలరబల్కెను॥ ... ... ... ... ... ౧

మరునాడుసభజేరెను-పట్టణభూమి - సురులసంగతిమీరెను - మాను
లతోడ-సరయువుదరిజొచ్చెను-స్నానముచేసి- పురికివేగమువచ్చెను-దివసం
బున - హరికీర్తనలతో శ్రీ - ధరపద్మనాభసుం- ధరకాయదివ్యమం- దరధర
యనుచును॥ అందమలరబల్కెను॥ ... ... ... ౨

నిరాహారముతోచేరెను- రాత్రిజాగరణమునెరవేర్చెను - ద్వాదశి
నాడు-పారణయునుదీర్చెను - శ్రీహరిపాద - సారసముల జేర్చెను-మనం
బున- నారాయణాచ్యుత- నారదవందిత - శ్రీరమణీశతో- మురారికృష్ణయ
ని॥ అందమలరబల్కెను॥ ... ... ... ... ౩

మోహినిరుక్మాంగదుం గానకచింతించుట-

ద్విపద.

ఈరీతిసువ్రతమీడేర్చుచున్న-యారాజుమహిమంబులంత దెలిసుక
తనయొద్దనుండెడితరుణిసేక్షించి - వనజాతనేత్రి యూవసుధేశుడిప్పు డెందు
బోయినవాడొ యెరుగంగరాదు - యిందెందుగానమేయిందివరాక్ష- నా
పక్కబాసిమేనాతిగృహంబు- భూపతిజేరెనో పొలతిరోసేడు-నాతోను జె
ప్పకనాకూర్మిభర్త-యీరాత్రివిడనాడె నేమందునమ్మ-నెయ్యంబువిడనాడె
నృపశేఖామణియు - నయ్యయోనగుబాటులాయెగదమ్మ- నరపతుల్పహు
నూతనప్రియులమ్మ- విరహంబుబాసినవిధుతురుగదవె- యెక్కడభూపతు
లెక్కడివనము- యెక్కడినారాయిటుతగులమ్మె - నిమిషమాత్రంబైన
నినుబాయననుచు - క్రమముగాబల్కి యిక్కడమాటదప్పె - మగటిమి
మగవారిమాటలుచూడ - మగువరో జనిమెండమావులరీతి- నో చెల్లరౌ

దారహితాత్మకు లెట్టివారలో - వరగుణవంతులంచు మగవారల నమ్మగరా దేభామినీ॥ ... ... ... ... ... *

చ॥ పరసతులంచు నెంచరయు పాయముతో మనసూరజేసి యొక్క కర జవదాటి నంతట ముఖాముఖిగా కలహించి నిందెలుకన్ । దురుసు నగట్టి హాస్యములు తుంటరి సన్నలు సేయువారలన్ ॥వరగుణవంతులంచు మగవారల నమ్మగరా దెభామినీ॥ * * * * *

చ॥ మరువనుకోదు ప్రేమయనుమానము లేల వెలంది పెంచునెం।।దర నిటు చూచినట్లు వసుదాకోనడింతుల మేలుబంతిగా। నిరతము నమ్మియుండెదను నీకృప సేల వెయంచు బల్కినన్ । వరగుణవంతులంచు మగవారల నమ్మగరా దెభామినీ॥ * ... ... ... ... *

చ॥ సరసిజగంధి చంద్రముఖి సారసనేత్రి సువర్ణ గాత్రి బింబాధర సమవేణి కంబుగళి భామజ సాధరినిన్ను గాని యెవ్వరి నిటు చూడనంచు మృదువాక్యములన్ మదిబాసి చేసినన్।। వరగుణవంతులంచు మగవారల నమ్మగరాదె భామినీ॥ * * * * * * * *

దరువు- సాధనామక్రియ- అటతాళము.

రాజులమదినమ్మరాగ- యింత-రసికజ్ఞులని తెలియలేదే యీ-జగములయందు - హితవని కోరలను-రాజీవాక్షులు పొంద - రాదే భామామణి॥
రాజుల॥ ... ... ... ... ... ౧

వలపునిలుపజాలనమ్మ-యే వనితయిల్లు జేరెనమ్మ-వలరాజు బారిక - గ్గలమాయె విరహము-చలపట్టి యీరీతి-సదయు డెందుబోయె॥ రాజుల॥ ౨

నమ్మించి విడనాడెనమ్మ-నా-సామ్మ నియుంటి కకొమ్మ-సమ్మతి కోలినీ-సామ్మునేననివల్కె-- నమ్మజెల్లబూట-కమ్ము తెలియనైతి॥ రాజుల॥ 3

తొండూరి కృష్ణునితోడె-నా- యండకునిటు లేలరాడే నిందుమనసు బ్రహ్మాండమై తోచెను-పుండరీకాక్షి యీ-భూపాలునిటు దేవే॥ రాజు॥ ౪

వాక్యము-

ఓలలనా నిలుకడ లేని విరహభరమ్మున తరియింప నాతరమ్ము గాదుగ

అ oపూతికృష్ణునిదయనెరుకా-మీరు-లోలగకవినరమ్మయూరుకా॥ ౫

ఉ ॥ అంగననాదు పేరుకొరవంజి యటంచు దుకునాదుసామి యుర్వ-సింగము తాను ద్రోణగిరిసీమజనుల్ గొనియాడనెప్పుడున్, పొంగుచు పోదచెప్పివరభూషణముల్ గొనివార్త కెక్కియూ। బంగరుపల్లెవానిమది బాయకనమ్మినవారమెన్నడున్॥ ... ... ... *

సూ॥ క ॥ ఏయేదేశముజూచితి। వేయేవొరసానులకునెరుకయుపే ర్కొ-న్। బాయకచెప్పితివదియును। నీయెడనెరుగింపవమ్మయెరుకలసానీ-

అవోళయ్యా - అవోళసామి- యూయూరిలో నొక్క-నాయకుడువి నాంగుంగరెంతహాపాత్మలయ్య॥ ... ... ... *

అదియేటనే. ... ... ... ... *

కుదరలేదుచెదరలేదు- గుడిసెలుకట్టలేదు- గాడిదెలకుబంచేలెమ్మం టారుగదయ్యా. ... ... ... ... ... *

సియ్యమ్మదబ్బరకత్తె. చేలోకిపోనిదేబంచయేలలెమ్మంటారే- *

అవోళయ్యా- అవోళసామి- ముందరకాళుముందరనేవుందేవెనకకా లివెనకనేయుందె-యూరికెనడిమికాలిబంచెలెమ్మంటారుగదయ్యా- *

ఓసెరుకలసానిచేనెక్క-డనుందెగాడిదెయెక్క-డనుందెనే-

అవోళయ్యా- అవోళసామీ-చేను నావలెనుందె గాడిదినీవలెనుందేబం చెయెందుకయ్యా- ... ... ... ... *

మోహినివాక్యము.

అయితేఆమెగానినీకథావృత్తాంతముచక్క-గాచెప్పవేయెరుకలసానీ

ద్విపద.

ఓరాజవదనయీయుర్విలోవలను - సారసాక్షులకునసౌఖ్యంబుగాను- మనసులోగల్గినమణికితములును - వినయంబుగాచెప్పివింతవింతైన- సా మ్ములువీకలుశృంగారములును-సమ్మతిగాచెప్పిసత్యలోకమున- భారతీదే వికిబంగమహాపణమున - నోరూరనెరుకయునుచితంబువెలయ- జెప్పికంకణ

ములుచేసరంబులును-నిప్పింపుమకొనికీర్తి నెగడినదాన- కైలాసమున నీలకం ఠునిసతికై నంతమున విఘ్నవనితకు వేగ - సారెచెప్పితినమ్మ సుందరగాత్రి- వాదభేదంబులువశీకరించి తెలిసి- యేబది యారు దేశంబులు తిరిగి-సబలంబు గల్గినసౌష్టవిద్య- లన్నినేర్చి యాగురులక్ష్యంబు నిల్పి-కన్నకలయు జెప్ప గల్గినదాన - గరితకోతాంబూరికకు శ్రీకృష్ణు - డెరుకపరచినవాడెరుక రమ్మ॥ ... ... ... ... ... *

దరువు- నాధనామక్రియ- అటతాళము.

మెరుకడ్గకేమీరు- మరువకమదిలోన- సరసుడౌసద్గురుని-గురినిల్పి వేగమే- యెరుకడ్గరారే-ఓయమ్మ॥ ... ... ... ౧

మాటలచేతల - పాటలగంధులు - సాటుగ్గల్గినా - మాటలుమదినమ్మి ఓయమ్మ॥ ... ... ... ... ... ౨

బిడ్డలభ్రమగల్గు - దుడ్డెలుమదిలోన - జడ్డులేకగద్దె - గొడ్డుకొంచెమనకే-ఓయమ్మ॥ ... ... ... ... ... ... ... ౩

పెండ్లిగానిచిరుత- వాండ్లెల్లజతగూడి- పెండ్లికోసము మీ- వాండ్లనడిగవేగ॥యెరు॥ ... ... ... ... ... ౪

మదిలోన సంశయము- మెదలక శ్రీతొండమూరి- సదయుని భక్తితో- ముదమొదవగనిల్పి॥యెరు॥ ... ... ... ... ౫

గీ॥ ఇటులపురవీథులందును నెరుకయనుచు। వచ్చుచుండిన సౌరినీటులిచ్ఛకమున। జూచిమదిమోద్యమందియా సుందరాంగి। మోహినీదేవికను గొని ప్రొక్కి యనియె॥ * * * * * * *

క॥ ఎక్కడనే దేశము సొగ। సెక్కడ చెల్వంబ డేమి యిది భారతియో। యక్కరో చెప్పగజాలము। యిక్కడకునుబిలిచి చూడనిష్టము దీనిన్॥

మోహిని వాక్యం.

అమ్మయ్యా యెరుకలసానినిజాగ్రతగా- పిలిచితెచ్చినాము నా- హారుంబ

